# JNANODAYAM

BY


TADUR LAKSHMI NARASIMHA RAI PANTULU,

*TOWN SUB-MAGISTRATE,*

CUDDAPAH.



**First Edition.**

Madras:

PRINTED AT THE ANANDA PRESS.

1909.

# JNANODAYAM




BY

**TADUR LAKSHMI NARASIMHA RAI PANTULU**

TOWN SUB-MAGISTRATE

CUDDAPAH.

First Edition.

MADRAS.

PRINTED AT THE ANANDA PRESS.

1909.

# జ్ఞానోదయము.



కడప టవున్ సబుమేజస్ట్రీటు

తాడూరి–లక్ష్మీనరసింహారాయ పండితవిరచితము

మొదటి కూర్పు.

చెన్నపట్టణము

ఆనంద ముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది.

**1909**

# విషయసూచిక - Contents.

## మొదటిభాగము Part I.



## రెండవభాగము. Part II.



## మూడవభాగము. Part III.

# PREFACE.

WHILE reading the poems of some of the best English authors a few years ago, I was quite captivated by the vivid and impressive morals contained in some of them, which were short and laconic, so much so that, after reading one of them, *viz.*, Longfellow's "Ladder of St. Augustine," I felt very sorry for having previously insured my life in a certain Life Assurance Company, on what is called the Ordinary Whole Life Policy system, and gave up the Policy by refraining from making further payments, under an apprehension that it would be sinful on my part to have obtained a legacy of the amount of Policy for my heirs if I should have died so early as not to enable the Assurance Company to realize that amount by the date of my death. I at once entertained the idea of translating them into the Telugu language, which language, though abundantly rich in all other kinds of poetry, sadly lacks such poetic gems; and, accordingly, as I went on reading them, I translated and published them among others, during the years 1892 to 1894, in the *Chintamani*, a well known Telugu monthly magazine, edited by Mr. Nyapaty Subba Rao Pantulu, High Court Vakil, practising at Rajahmundry.

2. These pieces are all didactic and "may be made useful"; and seeing that they have already been approved and that "the more they are approved, "the more likely they are to spread and conse-"quently the more likely to attain the end of useful-

ness," I now publish them in this volume, in addition to two pieces subsequently transtated by me. In my humble opinion, the book is such as should always be in the hands of every one, whether male or female, young or old, as I have no doubt it would serve as a good monitor whenever the mind happens to find a loophole to go astray or whenever it has an occasion to brood over misfortunes.

3. I have named this book *Jnanodayam* meaning the dawn of wisdom. I have divided it into three parts. The first part is called *Paurusha Margam, i.e.*, the duties of man to his fellow beings : the second part *Bhakti Margam, i.c.*, the duties of man to God : and the third *Vairagya Margam, i.e.*, the duties of man to himself.

(*a*) The first part consists of poems treating of (1) courage and assiduity in times of prosperity as well as adversity ; (2) gentleness of expression as well as intention ; (3) kindness and gentleness towards our fellow creatures when in trouble ; (4) conjugal fidelity ; (5) the way to mould up our character by avoiding evil deeds and evil thoughts ; (6) the irreparable loss attendant upon the abuse of time be it a moment, either by vice or idleness, and (7) the necessity for all men to discharge their duties with punctuality and on principle, be they high or low, for the reason that by their pursuits they "build up not only their own individual destinies but also the destinies of their country and their "race."

(*b*) The second part consists of poems treating of (1) the unity of God as well as His sway over the

whole universe; (2) humility and abhorrence of flattery; (3) thankfulness to God; (4) the usefulness of every creature made by God; (5) the evils of discontent with the gifts endowed by Him; (6) the circumstance that by God's mercy every man will be reconciled to his lot, and (7) the necessity for a universal song in praise of God.

(*c*) The third part consists of poems treating of (1) the vanity of human cares; (2) human frailty; (3) the existence of a happier world where we enjoy eternal love and blessings after death; (4) the immortality of the soul; (5) the perishable nature of everything earthly, irrespective of its beauty and grandeur, (6) the folly of lamenting over the dead, and (7) the redemption of time.

4. Subjoined is a table shewing the names of the pieces herein contained, together with the names of their originals in English and of their English authors:—

## PART I.

| | Name of poem. | | Name of original English poem. | | Name of original author. |
|---|---|---|---|---|---|
| 1. | *Utsaham* | ... | Never Say Fail | ... | Anonymous. |
| 2. | *Banageetam* | ... | The Arrow and the Song | ... | Longfellow. |
| 3. | *Mallika* | ... | The Rose | ... | William Cowper. |
| 4. | *Kapotam* | ... | The Doves | ... | Do. |
| 5. | *Nissrenika* | ... | The Ladder of St. Augustine | ... | Longfellow. |
| 6. | *Nashtadinaprakatana* | ... | Advertisement of a Lost Day | | Mrs. Sigourney. |
| 7. | *Silpam* | ... | The Builders | ... | Do. |

## PART II.

| | | | |
|---|---|---|---|
| 1. | *Bhautikam* ... | The Works of Creation ... | Heber. |
| 2. | *Mukhastavakhandani* | Undeserved Praise ... | Wither. |
| 3. | *Kritajnuta* ... | Thankfulness ... | Trench. |
| 4. | *Khadyotam* ... | The Glow-Worm ... | William Cowper. |
| 5. | *Vatapataka* ... | The Paper Kite ... | Anon. |
| 6. | *Dharmaguptam* ... | Alexander Selkirk ... | William Cowper. |
| 7. | *Stavagita* ... | A Song of Praise ... | Skelton. |

## PART III.

| | | | |
|---|---|---|---|
| 1. | *Eeshanamaya* ... | Vanity of Human Cares ... | Cowley. |
| 2. | *Paurushadaur-balyam* ... | Human Frailty ... | William Cowper. |
| 3. | *Aksharamaitry* ... | Friendship Immortal ... | Montgomery. |
| 4. | *Aksharam* ... | Immortality ... | Do. |
| 5. | *Pushpam* ... | Blossoms ... | Herrick. |
| 6. | *Runalankaram* ... | The Lent Jewels ... | Anon. |
| 7. | *Jivanmukty* ... | Redeem the Time ... | Tucker. |

CUDDAPAH,
1st *April*, 1908.

TADUR LAKSHMI NARASIMHA RAO.

# పీఠిక.



కొన్ని సంవత్సరములకు ముందు నేను గొంద ఱాంగ్లేయ మహాకవుల యణుకావ్యములు కొన్ని వినోదార్థంబు చదువుచో వానిలోఁ గొన్నింటిలోని మనోహరం బైననీతులకు నామనంబు బ్రహ్మానందంబు నొందె. వానిలో లాంగ్ఫెలో(Longfellow) యనుకవిచే రచింపఁబడిన నిచ్చెన యనుకావ్యము చదువుడు నేనంతకు మున్నె నా జీవిత మొక జీవితస్థిరీకరణసంఘము (Life Assurance Company) వారి వలన యావజ్జీవితకాల పద్ధతి (Whole Life Policy System) ని స్థిరీకరణము (Insure) చేయించి యున్నదానికి మిక్కిలి విచారించి యాసంఘమువారు స్థిరీకరణ ధనము నా వలన రాఁబట్టికొనుటకుఁ జాలినంతకాలము దాఁక నేను దైవికంబున జీవింపనిచో నాకుటుంబము కొఱ కంత ధనము వారిచే నిప్పించుట పాపకృత్య మనియెంచి యాస్థిరీకరణపత్రము విసర్జించితిని.

తెనుఁగుభాష పద్యకావ్యములతో నిండియున్న దైనను నీతిబోధకము లైన యారీతి యణుకావ్యములు దానియందు లేమిం జేసి వానిని దెనిఁగింపవలయు నని తత్క్షణంబ నాకు వేడుకపుట్టి వాని నిజదువు కొలఁదిని దెనిఁగించితిని. వానిని రాజమహేంద్రములోఁ బని సేయుచున్న చెన్నపట్టణ మహాన్యాయసభా న్యాయవాది (High Court Vakil) యగు న్యాపతి సుబ్బారాయపండితవరుని చేఁ బ్రకటింపఁబడిన చింతామణి యనుమాసపత్రిక (Monthly Journal) లో మఱి కొన్నిఁటితోఁ గలపి క్రీ. శ. ౧౮౯౩ వ సంవత్సరము మొదలుగా ౧౮౯౪ వ సంవత్సరము దాఁక నప్పుడప్పుడు ప్రకటించితిని.

2. ఆకావ్యములన్నియు నీతికావ్యము లగుటంజేసి మిక్కిలిఁ బ్రయోజనకరములు గా నుండఁగలవు. మఱియు వానిం జదివి పూర్వోక్తపత్రికా పాఠకు లెల్ల నింతకు ము న్నాదరించిరి కావు నను నాదరణము వడసిన కొలఁదిని నవి వ్యాప్తము కాఁగలవు కావునను వ్యాప్త మైనకొలఁదిని వాని ప్రయోజనకారిత్వము సిద్ధిఁ బొందును గావునను వానినెల్లఁగలిపి యవియును బిమ్మట నేను దెనిఁగించినవి యట్టివయగు మఱిరెండును జేర్చి యీగ్రంథ మునందుఁ బ్రచురించితిని. ఎన్నఁడేని మనస్సునకు ఋజు మార్గము వదలి వంకరమార్గమున నడువ సందు దొరకినప్పుడును కష్టములు వచ్చి దుఃఖింపవలసివచ్చునప్పుడును మనస్సునిది మరలింప నోపును గావున నీ తత్వగ్రంథము స్త్రీపురుషు లెల్లవారిచేతులలో నెల్లప్పుడు నుండవలయు నని నా యభి ప్రాయము.

3. ఈ గ్రంథమునకు జ్ఞానోదయ మని పేరు పెట్టినవాఁ డను. ఇది మూఁడుభాగములుగ భాగించినవాఁ డను. అందు మొదటిది పౌరుషమార్గము. రెండవది భక్తిమార్గము. మూఁడ వది వైరాగ్యమార్గము.

మొదటి భాగమందు

1) ధైర్య శ్రద్ధలును
2) మృదుభాషిత్వ మృదు హృదయత్వములును
3) కష్టములో నున్నవారిని దయతో నాదరింప వలయుటయు
4) పాతివ్రత్య పత్నీవ్రతిత్వములును
5) దుష్కార్య దుస్సంకల్పపరిత్యాగముచే సుగుణసంపద సం పాదించి దానిని నిలిపికొను మార్గమును

(6) గాలము దుర్వినియోగముచేయుటంజేసియు వ్యర్థపుచ్చుటం జేసియు ననివార్యం బగుకీడు సంభవించుటయు

(7) మనుష్యులలో నెల్లవాఁడును గొలఁదివాఁ డైనను దన యదృష్టమునకే కాక తన దేశాదృష్టమునకును దన జాత్యదృష్టమునకును గర్త యగుటయు న ట్లగుటంజేసి స్వధర్మమును మేర మీఱక విధ్యుక్తంబుగ జాగరూకతతో నైళమ జరపవలయుటయు

నను నివి బోధించు నణుకావ్యములు గలవు.

రెండవ భాగమందు

(1) నిత్యుఁ డై మన పాపములను హరించి మనకు ముక్తి నిచ్చువాఁడు పృథివ్యాదిమహాభూతముల కతీతుఁ డైనభగవంతుఁ డొక్కఁడే యగుటయు

(2) నడఁకువయును ముఖస్తవా సహిష్ణుత్వంబును

(3) భగవంతునియెడఁ గృతజ్ఞతయును

(4) భగవత్సృష్టిలోఁ గలజంతువు లెంత పిన్న వయినను ప్రయోజనకరములే గావున మనము దేనిని నిరసింపఁ గూమియు

(5) భగవంతుఁ డిచ్చిన సంపదతోఁ దృప్తిపొంద కునికివ కీడులును

(6) దైవానుగ్రహామువలనఁ గష్టంబులు నహితము సుఖలై తోఁచుటయు

(7) బ్రహ్మాండ మందుఁగల సకల జంతుజాలంబులు భగవ గీర్తింప వలయుటయు

నను నివి బోధించు నణుకావ్యములు గలవు.

## మూఁడవ భాగము

(1) దీమణమాయయును

(2) పౌరుషము దుర్బలమై దైవసహాయము లేక ఫలింపమియును

(3) దేహ పరిత్యాగానంతరంబ మానవులు శాశ్వతసుఖము లనుభవించు పరలోకము నునికియును

(4) జీవుని నిత్యత్వంబును

(5) నిహలోకైశ్వర్యాదుల నశ్వరత్వంబును

(6) మృతులైనవారికొఱకుఁ జింతించుట వెఱ్ఱితన మగుటయు

(7) జీవన్ముక్తియు

నను నివి బోధించు నణుకావ్యములు గలవు.

4. ఇందు వచ్చు నణుకావ్యము లీక్రింద వివరింపఁబడియె.

| భాగము పేరు. | అణుకావ్యము పేరు. |
|---|---|
| 1. పౌరుషమార్గము. | 1. ఉత్సాహము. |
| | 2. బాణగీతము. |
| | 3. మల్లిక. |
| | 4. కపోతము. |
| | 5. నిశ్రేణిక. |
| | 6. నష్టదిన ప్రకటనము. |
| | 7. శిల్పము. |

2. భక్తిమార్గము.
    1. భౌతికము.
    2. ముఖస్తవఖండని.
    3. కృతజ్ఞత.
    4. ఖద్యోతము.
    5. వాతపతాక.
    6. ధర్మగుప్తము.
    7. స్తవగీతి.

3. వైరాగ్యమార్గము.
    1. ఈషణమాయ.
    2. పౌరుషదౌర్బల్యము.
    3. అక్షరమైత్రి.
    4. అక్షరము.
    5. పుష్పము.
    6. ఋణాలంకారము.
    7. జీవన్ముక్తి.

కడప,
1-4-08. } తాడూరి - లక్ష్మీనరసింహారావు. 2

3



శ్రీ

# జ్ఞానోదయము.

## పౌరుషమార్గము.

### ప్రథమాధ్యాయము.

### ఉత్సాహము.

**NEVER SAY FAIL**

(*Anon.*)

శ్రీమత్సమస్తవస్తు
స్తోమావైకల్యసూచ్యసుమహాత్వనిధీ
సోమక్షీరాంబుధికీ
ర్తిమార్తాండశతకోటితేజా దేవా! 1

తే-గీ॥ అవధరింపుము జ్ఞానిమార్గానుసారి
వరభవద్భక్తదుగ్ధాబ్ధివారిజారి
భూరివాధూలగోత్రతాడూరిశ్రీనృ
సింహుఁ డీకృతి నరులకై చేసినాఁడు॥ 2

కం॥ క్షితిఁ బురుషుఁ డేని స్త్రీయేఁ
బ్రతిదినమును బ్రత్యవస్థఁ బఠియింపఁగ స
మ్మతి నీజ్ఞానోదయమున
నతీతసౌఖ్యాబ్ధి నోల లాడుచు నుండున్॥ 3

తే-గీ॥ మూలఁ గూర్చుండి చింతాబ్ధి మునిఁగి మునిఁగి
వనట వందురి వందురి వసరి వసరి
కాలకర్మఫలాకాంక్షలీల నోరు
తెఱచుకంటెను మేలు ముందఱకుఁ బోక॥

తే-గీ॥ వ్యర్థ మనఁ బోక యెన్నండు నవని దేహ
యాత్ర సల్పెదునవ్వార లనుదినంబు
నెదు రెదురఁ బోవ ధృతిఁ బూని యెలమి మిగుల
నెగడుదురు గాక పెఱవారు నెగడఁ గలరె॥

తే-గీ॥ కన్ను గలిగి మెలంగఁగఁ గలుగు దేని
నాలు కెడపక యాడింపఁ జాలు దేని
యిడుమ గుడువంగ వలసినయెడ నడలక
కడిమి యెడఁదను నిలుపంగఁ గలుగు దేని॥

ఆ-వె॥ వసుధ వేనవేలు వైరులు పయిఁ బడి
రైరి యేని వారిఁ బోర లీల
గెలుతు సుమ్మి నరుఁడ గెలు పేల రా దను
వార లోరులకంటె బలులు గారె॥

తే-గీ॥ కాన ముందంజ వేయుము కడఁగి సుస్థి
రుండవై సూటి గా నీదుత్రోవ నడుము
నీసిరి యు విద్య తేజంబు నీసుకతన
నోరువక కాఱు లఱచెడువారి నుఱక॥

# ప్రథమాధ్యాయము.

తే.గీ॥ ఓటు వడ నంచు నిచ్చలు నుత్సహించి
పాటు వడువానిసద్బుద్ధిపాటవమున
వడి వడిన్ వాని యొవ్వానివారు పొడ వ
డంగుదురు దాన నెల్లయుడ్డములు తీఱు॥

ఆ.వె॥ అన్న నీదు బాల్యమందునఁ గౌమార
మందు యౌవనంబునందు వార్ధ
కంబునందు నీవు కార్యముల్ సేయుచో
వ్యర్థ మనకు మనెడివాక్కు నూను॥

కం॥ ఇడుములు గుడిచెదున త్తఱిఁ
గడు సుఖములు గుడుచుతఱిని గడఁక యెలర్పన్
నడుమంతము మాకు జయము చే
పడుఁ గష్టము వ్యర్థ మంచుఁ బలుకము సుమ్మీ॥





## ద్వి తీ యా ధ్యా య ము.

## బాణగీతము.

## THE ARROW AND THE SONG

(*Longfellow.*)



తే-గీ॥ మింటి కే బాణ మేయం గ మంటిమీఁదఁ
బడియె నచ్చోటు నేఁ గానఁ బడయ నైతి
బాణ వేగంబు తల పోయ వాయువేగ
మును జయించుచు దృగ్వేగమును జయించె॥ 1

తే-గీ॥ వదిలితిని గీత మొకనాఁడు బయల నదియుఁ
బడియె నెందేని పుడమి నప్పడినచక్కి
గానఁ బడయను గీతవేగంబు ననుస
రింపఁ గలసూక్ష్మదృష్టి యేరి కిలఁ గలదు॥ 2

తే-గీ॥ పెద్దకాలంబునకుఁ గంటి వెనుక నొక్క
చెట్టులో బాణమును జెక్కు చెదర కుండ
వెండి యొక చెలి హృదయారవింద మందు
నౌర గీతము గంటి నాద్యంతము గను॥ 3

ఆ-వె॥ నరుల మనములోన నాటిన యా మాట
లౌర నిష్ఠురమ్ము లైన మృదువు
లైన వెడల నేర వది యేమొ యెన్నియు
పాయములను దలఁప వసుధలోన॥ 4





# తృతీయాధ్యాయము.

## మల్లిక.

## THE ROSE

*(Cowper.)*

---

తే-గీ॥ అల్లమీనాక్షి మధుపున కంపినట్టి
బొండు మల్లియ వానకు మెండు తడిసె
నల్ల తడిపెల్లు భారమై యకట తోఁపఁ
బువ్వు తనతల వాల్చెను ముద్దు దోఁప॥ 1

తే-గీ॥ దాని కడు పెల్ల నీరయ్యె దానిరేకు
లెల్లఁ దడిసెను బెల్లులసిల్లు లతలఁ
గరము సొంపారు తోడిమొగ్గలను బాసి
వచ్చితి నటంచు నది యేడ్చు పగిదిఁ దోఁచె॥ 2

తే-గీ॥ చింతఁ గన్నీరు మున్నీరు చేయు మల్లి
క యనుభవయోగ్య గాదైనఁ గరుణ మాలి
పట్టి యాడించితిని బిట్టు బంతిఁ బోలె
నంత పూ నల్గె రేకులు నకట రాలె॥ 3

తే-గీ॥ ఇట్టిదే సుమ్మి క్రూరులై యిందుఁ గొంద
ఱకట నెవ్వఁగఁ బొగిలెడు నట్టిమృదు హృ
దయుల యెడ వారి దైనహృదయము పగులు
నంచు నెంచ కనాదర ముంచు విధము॥ 4

తే-గీ॥ అల్లమృదు మల్లికను మెల్ల నార్తు నేని
కొండొ కింపులు విభునొద్దఁ గులుకుఁ గదవె
నేర్పుతో మెల్లమెల్లఁ గన్నీటి నొత్తఁ
బరఁగఁ జిఱునగ విగురొత్తవచ్చుఁ గదవె॥ 5



## చ తు ర్థా ధ్యా య ము.

### కపోతము.

### THE DOVES

(*Cowper.*)

తే.గీ॥ అడుగడుగునకు శంకించి నడుచుఁ గాని
ధరణి మనుజుఁడు తనత్రోవ తప్పి పోవు
క్షుద్రజంతువు లైనను జోద్య మయ్యెఁ
దెన్ను విడువవు సహజ మౌఢ్యమెలర్ప॥ 1

తే.గీ॥ మున్నొకదినాంతమున నోరప్రొద్దు వేళ
వనము నందున విరహిణీవాక్కు వింటి
నెట్టు లంటేని నిజభర్త నిట్టు లొక క
పోతి పలుకుచు నూరార్చి ముద్దు గులుక॥ 2

తే.గీ॥ అకట మనయిందరొరులకుఁ బ్రేమానుబంధ
మురివి నేనాఁటికిని దెగ కుండుఁ గాత
మనచిఱుత నాఁటి సౌఖ్యముల్ మనల వార్ధ
కమ్మునాఁటికి వెలయును జుమ్మి నాథ॥ 3

తే.గీ॥ మఱియు దంభము లేని యమాయికత్వ
మును చిరం బైనయనురక్తి పొంపిరి గని
యల్ల చూపులలో నెల్లయపుడు వెలుఁగు
కతన నవ్వాని నేఁ గాంచఁ గలుగుకతన॥ 4

తే.గీ॥ ఇందుఁ గలవారలకు వచ్చునిడుమ లెవ్వి
యనుభవింపను జుమ్మి న న్ననుసరించు

నేని యవ్వాని వెడవెడ మానసమునఁ
గాంచి విడిచెద నోరుసామ్ము కాఁగ నెంచి॥ 5
తే-గీ॥ మెఱుము లిలఁ జెట్లనడుమను మెఱయువేళ
గృధ్రములు డాఁపుగా మింటఁ గెరలువేళ
నిన్నె యవి యెల్లఁ గొంపోవ నున్న వనుచుఁ
జడియుదును గాని యన్య మాజడు వెఱుంగ॥ 6
తే-గీ॥ అప్పుడే నేను భార్య నం చరసి నిన్నుఁ
గాఁగిలింతును నిజ నాధు గాఢముగను
జగతి జన్మానుబంధముం జావు ద్రెంప
నేర దంచును నెమ్మది నిశ్చయించి॥ 7
తే-గీ॥ కాక క్షమియింపు నాదువెంగలితలంపు
వెకలి వై యనువ్రత మెల్ల వీడనాడి
నీవు దయ మాలి యిప్పటి నీ యవస్థ
యకట దైవికమున నొల్ల వైతి వేని॥ 8
తే-గీ॥ మీఁద నుండి యేతెంచెడు మెఱుము లేల
కటికి ముక్కులు గల యట్టి గద్ద లేల
అకట నీలాలనము లేని యట్టివేళ
నివ్విధవవృత్తుప్పట మ్మది ద్రెవ్వ పోదె॥ 9
ఆ-వె॥ అనుచు మలయపవనుఁ డల్లన వీచెడు
పగిది ముద్దుగువ్వ పలుక వింటి
విన్న దాని నేను విన్నవించితి నిందుఁ
బుడమి నరుల కెల్ల బుద్ధి చెప్ప॥ 10



## పంచమాధ్యాయము.

## నిశ్రేణిక.

## THE LADDER OF ST. AUGUSTINE

*(Longfellow.)*

తే-గీ॥ మనయకార్యముల్ దిగఁ ద్రొక్కి యనువుమీఱ
నిలిచితిమ యేని మనదోషములను నెల్లఁ
జెర్చి యవ్వానితోడన శ్రేష్ఠ మైన
నిచ్చెన యొకండు గట్టంగ నేర్తు మార॥ 1

తే-గీ॥ అనుదినంబును మన చేయునట్టి యల్ప
మైన పనులును లెక్కకు రానిపనులు
మన సుఖంబులు కష్టముల్ మదిఁ దలంప
నల్ల మే లైన నిచ్చెన కెల్ల మెట్లు॥ 2

తే-గీ॥ ఒరుల సుగుణంబులకు ను వంకరలు పెట్టఁ
గోరు నీచపుఁ గొంచెపుఁ గోర్కె వెఱ్ఱి
నీళ్ల కై పు కై కాంక్షయు నీతి మాలి
దుండ గీండ్రయి చేసెడు దుడుకుఁ బనులు॥ 3

తే-గీ॥ తుచ్ఛ సుఖముల పై యాస స్వచ్ఛమైన
ధర్మ పథ మేది పదవిఁ బొందంగ జతన
మనఘమతి బాల్యమునఁ గోరుననఘములను
దోసమలవాటుచే నవ్వదోషబుద్ధి॥ 4

తే-గీ॥ చెడుఁదలంపులు తలఁచుట చెడుఁదలంపు
లూని చెడుఁగార్యములఁ జేయఁ బూనికి మది

మంచి యిది యంచు నెద్దని మనము చేయఁ
బోవుతఱి వెను దీయంగఁ బుట్టు బుద్ధి॥

ఆ-వె॥ వీని నెల్లఁ దొలుత వేగమ కాలిడి
త్రొక్కవలయు మెట్లు త్రొక్కుపగిదిఁ
బరుల మదిని నడుపఁ బాత్రత యొసఁగెడు
పదముఁ జేర మదిని వలతు మేని॥ 6

ఆ-వె॥ మన కెఱకలు లేమి మన మెగురఁగ లేము
కాళ్లు గలవు గానఁ గాళ్లతోడ
మెల్ల మెల్ల నెక్కి మేలైనమోక్షమా
ర్గంబు గానవచ్చుఁ గ్రమము దనర॥ 7

తే-గీ॥ పడమటి యెడారినడుమను బెడిదముగను
మిన్ను వ్రయ్యలు సేయుచు మీఁది కేగు
మంటపము డాయ డాయంగ మనకుఁ గాన
వచ్చుసోపానముల నెక్క నచ్చుఁ గాదె॥ 8

తే-గీ॥ మిన్ను లంటుచు దవ్వుల నున్నయపుడు
మనకుఁ గన్నులు తిరిగెడు మంచుఁగొండ
యైన డగ్గఱ డగ్గఱ నందుఁ గాన
వచ్చు మెట్లకలిమి నెక్కవచ్చుఁ గాదె॥ 9

తే-గీ॥ మున్ను గైవల్య మందిన పుణ్యపురుషు
లెవ్వరే నందుఁ బోవంగ నెగిరి రటవె
యిల్ల నెడునూతఁ బామరు లెల్లఁగూల
వారు ధృతిఁబూని నెగడినవారు గాక॥ 10

తే-గీ॥ ఈతిబాధలు పడిపడి యిహములోన
నెలకొలిపి కష్టముల నెల్ల నెత్తిమీఁద
శమదమంబులు రెండును సంగ్రహించి
పరమునకు రాజమార్గంబు పడయవచ్చు॥ 11

తే-గీ॥ పడితిఁ గష్టంబు లంచును వగవఁ దగదు
పడ్డవాఁ డెన్నఁటికిఁ జెడ్డవాఁడు గాఁడు
పడినపాటులచే బుద్ధి వచ్చి తుదకు
భవ్యదివ్యపదంబును బడయ వచ్చు॥ 12



    

## ష ష్ఠా ధ్యా య ము.

## నష్టదిన ప్రకటనము.

## ADVERTISEMENT OF A LOST DAY

(*Mrs. Sigourney.*)

తే-గీ॥ పోయెఁ బోయెను బోయెను బోయెఁ బోయె
స్వర్గమున స్థాపితంబయి వరలు చుండు
జీవగిరి త్రవ్వి తెచ్చిన చిత్ర మైన
విలువ లేనట్టి యామణి వెడలి పోయె॥ 1

తే-గీ॥ అమ్మణికిఁ దేట వజ్రమ్ము లఱువది యయి
యొప్పఁ బెద్దవి యందు నొక్కొక్క వజ్ర
మున కఱువ దేసి చంచలమ్ములును జిన్న
చిన్నవియు నై నవజ్రముల్ చెలఁగు చుండు॥ 2

తే-గీ॥ పోయెఁ బోయెను బోయెను బోయెఁ బోయె
వెదుకఁ గా దాని కొఱ కది వృథయ వృథయ
అకట కట విల్వలేనట్టి యల్ల మణి యిఁ
కెన్నఁడును నాది కానేర దేమి సేయ॥ 3

తే-గీ॥ దానికై పారితోషిక మీను నేన
దెట్టు లంటేని యీయను వేగు దాఁక
మరల రాకుండ దొంగిలింపంగఁ బడియె
దివ్య కృపలబ్ధ మైన యాభవ్య మణియు॥ 4

తే-గీ॥ ఐననుం జీర్ణవస్త్రంబు లకట వీడు
తెఱఁగు నను దేహములు వీడి దేహు లెల్ల
మృతి గనిన జీవులను విమర్శించువాని
చేతిలో నాదుమణిఁ గందుఁ జిత్తములుక॥ 5

తే-గీ॥ ఏమి చేసితి నీమణి నెందుఁ బాఱ
వైచితివి సాధ్య మది కాద వసుధవారి
కనుచు నాజీవు నడిగిన నతని కాతఁ
డేమి ప్రత్యుత్తరం బప్పు డియ్యఁ గలఁడు॥





## సప్తమాధ్యాయము.

## శిల్పము.

## THE BUILDERS

(*Longfellow.*)

---

తే-గీ॥ అందఱును విధిశిల్పు లే యిందుఁ గాల
చక్రమునఁ బాటు పడు చుండ్రు చక్కఁగొంద
అల సరసకావ్యరచనలయందుఁ గొంద
అతి భుజబలంబు వలసెడు నట్టిపనుల॥ 1

తే-గీ॥ ఎద్ది వమ్ము గా దిల నీచ మెద్ది గాదు
తెలియఁ జూడంగ నెక్కువ దేని కదియ
ఎద్ది డంబము గాఁ దోఁచు నద్ది తక్కు
గలుగు దానికిఁ బుష్టి యుఁ బలు పొసంగు॥ 2

తే-గీ॥ మనవినిర్మించు గృహము న కనువు పడఁగఁ
గలవు సంభారములు పెక్కు కాలమందు
నకట మననిన్నలును నేఁడు లవని దానిఁ
గట్టు వాసముల్ దూలముల్ గావె మనకు॥ 3

తే-గీ॥ వానిఁ దీరిచి దిద్దుము వానిలోనఁ
బీఁటలును దొట్టి లుంచక వెలయఁ జేయు
పరుఁడు చూడఁడు గద యని సరుఁడ యవ్వి
చూడఁబడవంచు నమ్మకు సుమ్మి నీవు॥ 4

ఆ-వె॥ తొల్లి శిల్పకుశలు లెల్ల రేమఱక క
రమ్ము మఱుఁగుఁ బట్లు రాణ నొప్పఁ
దీర్చి దిద్ది రెలమి దేవ్రుఁ డెల్లెడలను
గాంచు చుండు ననెడి కారణమునఁ॥ 5

తే-గీ॥ అద్ది గావున వారలయట్ల మనము
నాచరింతము గుహ్య బాహ్యములు రెండు
నెందు భగవంతుఁ డుండు నయ్యెల్లు సేయ
వలయు నిండు గ సని గ నిర్మలము గాను॥ 6

తే-గీ॥ కాక యుండినఁ గాలచక్రమున నిల్చు
నట్టి మన జీవనంబుల యందుఁ దొట్రు
లుండు విరిగిన సోపాన ముండె నేని
కాళ్లు తడఁబడుఁ జుమ్మి యెక్కంగఁ బోవ॥ 7

తే-గీ॥ కావునను బెద్దపరపును లావు గలుగు
నస్తి భారముతోఁ గట్టు మయ్య నేఁడు
దానిపయి నెక్కి నిశ్చింతఁ దనదు చక్కి
రేపు గనుఁగొనఁ గల దది యేపు మీఱ॥



కం ॥ పండితవినుత సుచరితా
ఖండిత దేవారి బృంద ఘనదివిజశిరో
మండన మండితపాదా
పాండురయశ యా ర్తభూత బాంధవవా చే!



గద్య ॥ ఇది శ్రీవాధూలసగోత్ర తాడూరి రామరాయ
భట్టాగ్రపుత్ర లక్ష్మీనరసింహారాయ ప్రణీతం
బైన జ్ఞానోదయ మునందలి
పౌరుషమార్గము.





# జ్ఞానోదయము.

## భక్తిమార్గము.

### ప్రథమాధ్యాయము.

### భౌతికము.

## THE WORKS OF CREATION

(*Heber.*)

---

కం॥ శ్రీవిష్ణు సర్వసాక్షీ
పావన సర్వజ్ఞ భూతభావన వరదా
దేవేశ పాపహారి మ
హావీర్యా మోక్షదాయి యక్షర దేవా. 1

తే- గీ॥ చిత్తగింపు తాడూరి లక్ష్మీ నృసింహుఁ
డాది పండితశ్రేష్ఠమార్గాను సారి
విజితకామాదిషడ్వైరి వేడ్కనిట్లు
చెప్పుచున్నాఁడు నరుల కై చిత్తశుద్ధి॥ 2

సీ॥ పూలతోఁ బండ్లతోఁ బొల్పొందు వృక్షాళి
పచ్చని సస్యముల్ పరఁగు చుండ।
భూమిదేవిని జూచి పాలతిరో నీతోడ
మూడు లోకంబుల నీడు గలదె।
యి ది మొదల్ నడు మిది యిది తుది యనరాక
కరఁచి పోసిన వెండికరణిఁ బరఁగు।
నలసముద్రుని జూచి యయ్య నీకును జూడ
మూడులోకంబుల నీడు గలదె।
యనుచుఁ బొగడితి నంత నయ్యమ్మ యయ్య
భ్రమసితివి నీవు మముఁ జూచి బ్రాహ్మణుండ
నేఁటిదే నుమ్మి మాచెల్వ నిక్క మున క
టంచుఁ బ్రత్యుత్తరం బిచ్చి రకట నాకు॥ 3

సీ॥ బంగారురథ మెక్కి పొంగుచుఁ గ్రాలుచుఁ
గన్నులు మిఱుమిట్లు గ్రమ్మఁ జేయు।
సూర్యదేవుని జూచి యార్య నీకును జూడ
మూడులోకంబుల నీడు గలదె।
వేసవియందలివేఁడిమి హరియింప
నెలమితో నమృతంబు చిలుకరించు।
చందమామను మింటఁ జనఁ జూచి నీకును
మూడులోకంబుల నీడు గలదె।

యనుచుఁ బొగడితి నంత నయ్యయ్య లపుడు
బ్రమసితివి నీవు మముఁ జూచి బ్రాహ్మణుండ
మా వెలుంగులు మూన్నాళ్లు సూవె నిక్క
మంచుఁ బ్రత్యుత్తరం బిచ్చి రకట నాకు॥ 4

సీ॥ ఇంతంత యని భక్తు లెన్నంగఁ జాలని
యురు కరుణారస మొప్పు దేవ।
యింతంత యని యోగు లెఱుఁగంగఁ జాలని
యురుమహోన్నతి యొప్పు దేవ।
యాకార నీసృజియించి నట్టిపదార్థంబు
లం దల్పమైన యీయవని మొదలు।
గాఁ గల యట్టి వే కర మిట్టు లొప్పారఁ
బాపిష్ఠనరులు ను వానిఁ జూచి।
కులుకుచుండంగఁ దత్పాపములు హరించి।
యల్లవైకుంఠపురములో నహహా నీదు।
సన్నిధిని వారి నునుప నీసమ్మతించు।
దివ్యభవనంబు లె ట్లున్నొ తెలియ వశమె॥ 5





ద్వి తీ యా ధ్యా య ము.

ముఖ స్తవఖండని.

## UNDESERVED PRAISE

*(Wither.)*

తే-గీ॥ దేవనాదోషముల నీదుదివ్యమహిమ
కతమునం జేసి యొరు లెఱుఁగం గ నేర
రప్పు డప్పుడు నే వినునట్టిరీతి
వారు నను బొగడుచు నుండువారలౌట॥ 1

తే-గీ॥ నేను న న్నెఱిఁగినరీతి నిక్క మొరులు
న న్నెఱింగి ర యేనియు నన్ను నిప్పు
డెంత పొగడిరి యవ్వార లంత దూఱ
వలయుటకుఁ గారణము దేవ గలుగుఁ జుమ్మి॥ 2

తే-గీ॥ పరులచూడ్కికి మే లైనపనులుకొన్ని
చేసి యుందును బో దేవ చెలిమి నెఱపి
యైన నామదిలో నెట్టి హైనపాప
చింత లవి గల వెకొ తెల్ప సిగ్గు వొడము॥ 3

కం॥ నా పశు కామోద్రేకము
నాపాపపుఁజింతలెల్ల నాహృదయములో
నేపారు గర్వపటిమయుఁ
జూప తెలుఁగ కున్న నీవు చూడవె దేవా॥ 4

కం॥ అది గావున నాగుణములు
మది నన్నులుకంగఁ జేయుమాడ్కి నొరులు న
న్నొదితము గఁ బొగడు చుండుట
యది నను సంతోషపెట్ట దక్కట దేవా॥ 5

కం॥ కారణము లేక నన్నొరు
లేరైనను బొగడఁ గడఁగి రే నెల్లను జూ
కారణము లేక నన్న
న్వారలు దూఱెద రయేని వలచెద దేవా॥ 6

కం॥ నా చెయ్వు లెట్టు లగపడ
నా చేతోవృత్తి మెల్ల నయయుక్తము గా
నాచూపఱ కెట్లుండిన
నీచూడ్కికి నింపు చేసి నిలుపవె దేవా॥ 7



# తృతీయాధ్యాయము.

## కృతజ్ఞత.

## THANKFULNESS

*(Trench.)*

తే-గీ॥ మింటఁ ధగధగ సూర్యుండు మెఱయు సుదిన
మంట, నలమింట నల్లపూ సంత నల్ల
మచ్చ గల్గె నే భారపు మానుసు లల
నల్ల మది నిల్పి దూషింతు రల్లదినము॥

తే-గీ॥ కన్ను కంటి కొకింతైనఁ గానఁ బడని 1
కటికిచీఁకటి యొల్లెడఁ గలుగుదుర్ది
నమున మెఱు మొక్కటి యు గగనమున మెఱయ
నతికృతజ్ఞులు భూషింతు రల్లదినము॥ 2

తే-గీ॥ ఔర మేడలు మిద్దెలు నధికముగను
గలిగి గర్వించి సంతృప్తి గాన లేక
కటకటా జీవితం బింత కష్ట మగునె
యనుచు విధి దూఱు దుర్జను లవనిఁ గలరు॥ 3

తే-గీ॥ పూరిగుడిసెలలోనఁ గాపురము చేయు
చింత మేల్ సేయు నే ప్రేమ యొసఁగ మనకు
దేవుఁ డంచు ను మదిలోనఁ దృప్తి మిగుల
గలిగి వర్తించు నతి కృతజ్ఞులు ను గలరు॥ 4



## చతుర్థాధ్యాయము.

## ఖద్యోతము.

# THE GLOW—WORM

*(Cowper.)*

---

తే-గీ॥ అల్లదే యేటి యాచాయ ననుదినంబు
పవలు కంటికిఁ గన రాక పరిపరివిధ
ముల వెలుంగుచు రే లెల్ల నెలమి పుట్టఁ
దిరుగు చున్నది మిడుఁగుఱుఁ బురువు గంటె. 1

తే-గీ॥ ఇందు దానిప్రయోజన మెట్టు లున్న
మనకు రవిశశితారకలను సృజించి
మింట వెలుఁగంగఁ జేయు నమ్మేటి విభుఁడు
దాని కొలఁదికిఁ దగువెల్గు దయ నొసంగె. 2

తే-గీ॥ అవని నిసు మంత కొలఁదిది యైనదీని
కాంతి రేయిటఁ దెరువరికాలు ఱాయి
తగిలి పడ కుండఁ జూపంగఁ దగును గాన
నక్కటా దీని నెన్నండు త్రొక్కఁ బోక. 3

తే-గీ॥ తెరువరీ నీవు నడిచెడుతెన్ను కన్ను
బ్రమయ కరయుము జాగ్రదవస్థ గలిగి
యనుచుఁ జెప్పంగఁ గాఁ బోలు నల్లదివ్వె
యిచ్చె మనలకుఁ గరుణతో నీశ్వరుండు. 4

తే-గీ॥ దాని భగవంతుఁ డే వెల్గ నాన తిచ్చె
నాన తిచ్చుట రిత్త గా దకట వాని
భావ మెట్లున్న మది శంక వదిలి నరుఁడ
యెఱుఁగు మిది దేవసిశ్చయ మ్మింత వట్టు. 5



ప ం చ మా ధ్యా య ము.

వా త ప తా క.

## THE PAPER—KITE

(*Anon.*)

---

ద్విపద. అవనిలో నొకనాఁడు హా గాలిపడగ
దివి దాఁక నెగయంగ దీమసంబునను
దన యున్నతపదవి తలపోసి మిగుల
మనమున గర్వించి మఱి యిట్లు పలికెః— 2

నా యున్నతపుటున్కి నాహా యల్ చూఁచి
యీ యీయి జనము లత్యాశ్చర్యమునను
వెడనోళ్లు తెఱచుచు వెడతల లెత్తి
మిడిగ్రుడ్లు వింత గా మిటకరించెదరు. 4

అఱిమి నాచేసెడు నప్పను లెల్ల
నెఱిఁగి రేని యు వార లే మా దురొక్కొ ?
ఇల స్వేచ్ఛ గందు నే నెసక మెసంగ
బలె చాంగుభళి యంచుఁ బొఱియుఁ బొఱి 6

మింట నటించు నేను మేదినివారి
కంటికిం తైనను గనం బడకుందు.
కట కటా చెఱలోని కష్టుని మాడ్కి
నటు ప్రోవకుండంగ నవనికి నన్నుం 8

దిగుచు చున్నది త్రాడు తిగియక యున్నం
ద గగరుడుని మాడ్కి దవు దవ్వు ప్రోదు —
అటు పల్కి పల్కుతో నార త్రెంపంగ
నటు నిటు లాగంగ నల త్రాడు త్రెవ్వె. 10

అగునట్టి బంధన మట్టులు ప్రోవ
నెగయంగ గమకించె నెంత యు వేడ్కం.
తనభార మింత యుం దా మోవలేక
తనఱెక్క లల్లార్చి తాం గొట్టికొనియె. 12

తనత్రోవం బోలేక తా గాలిచేత
మునింగె బుడుంగున మున్నీటిలోన.
ఓ వెఱ్ఱిపడగ యోహో గాలిపడగ
యేవి ఱెక్కలు నీకు నెగయం గడంగ 41

నీవు త్రాడిల లేక యెగిరెద వెట్టు
లీవున్నయునికి నీ వెఱుంగవు కంటె ?
దైవమా పాపిష్ఠిధరణి నే నిప్పు
డా వెఱ్ఱిపడగను ననుకరించెదను. 16

నీవు గల్గఁ గఁ జేసి నే నుంటి ననక
యీ వేళ యేలుట యిలనని తోఁచి
నాకు నీ వొసఁగిన న్యాయపదమ్ము
ప్రాకటంబుగ దాఁట వలచినవాఁడ. 18

ఇది నాకుఁ జాలద యిది చాల దంచు
నిద్ది యించు కింతుక యించించు కంచుఁ
బలు మాఱు పెద్దకుఁ బలుమ జెక్కువకు
వలచితి నే వృథా వసుధలోన కట ! 20

దైవసంబంధ మా దయ లేక యున్న
నే వెఱ్ఱిపడగ పా ల్లె పడు వాఁడ.
కాన నీయెడఁ గృతజ్ఞతఁ గల్గి దేవ
మానిసి తనివి చే మనుగడ యొప్పు. 22



షష్ఠాధ్యాయము.

ధర్మగుప్తము.




# ALEXANDER SELKIRK

(*Cowper.*)

ద్విపద॥ నాచూచునదియెల్ల నాదురాజ్యంబ
యీచక్కి నాకుమాఱెవఁడులేఁడయ్యె. 1

అరయనీదీవిలో నలవార్ధిదాఁకఁ
దిరుగుపక్షిమృగాళి తెలియనాసొమ్ము. 2

ఐనసంతోష మింతైన నను పైవ
మానాకులేదయ్యె మదిలోఁదలంప. 3

ఓ నెవానప్రస్థమా ! యోగులెల్ల
నీనెద వీవనియెదు సౌఖ్యమేది? 4

ఈరీతినడవిలో నేలుటకంటె
నూరిలోఁగాపునై యుండుటమేలు. 5

నాకంటఁబడఁడయ్యె నరుఁడొండుచూడ
నీకాటిలోన నే నేకాకినైతి. 6

ఎలమి మానిసిపల్కులే విందమిన్నఁ
గలనైన లేవయ్యెఁ గటకటనాదు 7

పలుకులేవిన్నంతఁ బలువిధంబులను
నులికెదఁ దద్దయు నుల్లంబులోన. 8

ఇందుఁగల్గు మృగంబు లెరవనఁబోక
పొందొందనిల్చి నాప్రోల నగ్గనెఢు. 9

అవి మానిసిని గాన వయ్యో ము న్నెందు
నవనినీ మచ్చిక యాశ్చర్యకరము. 10

ఓ మేలిసంఘ మా ! యోచెల్మి ! ప్రేమ !
తా మిమ్ము జనులకు దైవం బొసంగె. 11

అల గువ్వకును బోలె నక్కట టెక్క-
గలిగనే మిము వేగఁ గాంతును గదవె. 12

నలి ధర్మములు చేసి నామనోవ్యధ ల
వులఁ బాచి వైచెదఁ బొం దొందఁ గదవె. 13

మన్ననఁ బెద్దల మాట గైకొంచుఁ
జిన్నలతో సంతసింతును గదవె. 14

ధర్మముల్ ద లఁపంగ దవ్వయ్యె నాకు
ధర్మశబ్దార్థంబు తలపోయ నౌర 15

కనకంబుకంటెను గడు విల్వ గలదు
విను రత్నములకంటె వి ల్వధికంబు. 16

ధర్మగుప్తాఖ్య వృథా యయ్యె నాకుఁ
గూర్మిభక్తిని బోవఁ గోవెల లేదు. 17

తగ యజ్ఞముల కుపద్రష్ట లేఁడయ్యె
నిగమాంతవాక్యముల్ నే విన లేవు. 18

హరిభజనము సేయ హరిదినమందు
నరుఁ డొందు లేఁ డేమనంగలదింక. 19
నట్టేటిలో నట్లు నాయోడ ముంచి
యిట్టు నన్ బడ వైచి యేగినయట్టి. 20
వాయువా మాసీమ వార్తలు తెమ్ము
ఆయూళ్లు చూచుభాగ్యంబబ్బకున్న. 21
నది కారణంబు గా హో వాయుదేవ
మదిలోనఁ గలవంత మానెదఁ గొంత. 22
న న్నడిగెద రొక్కొ నాచెలు లెల్ల
నన్నుఁదలంతురే నాచెలులెల్ల. 23
చెలు లున్నవా రంచుఁ జెప్పుమా నాకుఁ
జెలు లున్నవా రంచుఁ జెప్పితేఁజాలు. 24
అలవారిఁ జూచు భాగ్యము నోఁచ నైతి
నిల నని మానకు మీ వార్తచెప్ప. 25
మతి కెంతవేగంబు మహిలోనఁగలదు ?
అతు లితం బది చూడ నలదానితోడఁ 26
బురుడుగా నేరవు పుడమిలోసూర్య
కరజాలవేగంబు గాడ్పువేగంబు. 27
మదిలోనఁ దలఁచిన మాత్రాన నిప్పు
డదిర మాదేశంబు నం దుంట గంటి. 28

అడరి యంతటిలోన హా స్మృతి వచ్చి
యడుగంటఁజేసె నాయాశలనెల్ల. 29
అయిన నిందలి పక్షు లవెగూళ్లఁజొచ్చె
శయనించె మెకములు చక్కనిగుహలఁ. 30
విశ్రాంతి గలద యీవిపినంబునందు
విశ్రాంతి గన నాదు విడిదికిఁ జనెద. 31
ఎందు న్న భగవంతు కృప యుండుదాని
చందంబుతలఁప నుత్సాహంబుపుట్టుఁ 32
గష్టంబు లెల్ల సుఖంబు లై తోఁచుఁ
దుష్టాంతరంగంబు తోడన వచ్చు. 33
కావున లోకేశుఁ గరుణాసముద్రు
భావించి యిద్దీవి వసియించువాఁడ. 34



# సప్తమాధ్యాయము.

## స్తవగీతి.

## A SONG OF PRAISE

(*Skelton.*)

---

ద్విపద. గగనంబునను వెల్గుగ్రహముఖ్యులార
జగ మెల్ల విని మిమ్ముఁ జయ్యనఁ గూడి
పాడు నట్లు గఁ బెద్దస్వనముతో లెస్స
వేడుకఁ బాడరే విశ్వేశు భక్తి. 2

లోకేశు తేజంబులోపల నకట
చీఁకటినల్లనై చెలు వేది చిన్న
మచ్చనై యొప్పబింబంబుతో నుండు
పచ్చగుజ్జుపు రౌత పాడుము దేవు. 4

స్వచ్ఛమౌచంద్రనక్షత్రంబులార
యిచ్ఛతో లోకంబు లెల్ల వినంగ
నిర్మలం బగురాత్రి నిశ్శబ్ద రాత్రి
పేర్మితోఁ బాడరే విశ్వేశు మీరు. 6

ఆదికాలము నుండి యకట యిందాఁక
రాదొక్కో మొందుండి రక్షితా నిందు

నార కాలము చాల కాప్రపంచంబు
లార మీరును బాడుఁడా పరమాత్మ. 8

ఆర సర్వంకష మహాగాలివాన
లార మూపునఁ దాల్చి యవ్యయు స్తవము
దశదిశల్ భూనభోంతరములు నిండ
విశదంబు గాఁగ వ్యాపింపఁ జేయుండ. 10

జడదంబులను జీల్చి చయ్యన వచ్చి
పుడమి దూరు బెడిదఁపుం బిడ్డ లార
పాతాళముఖలోకవాసుల్ వినం గఁ
బ్రీతిఁ గంఠం బెత్తి విభుఁ బాడఁ గదరె. 12

మకరాలయముక్రింద మడఁగి యున్నట్టి
సకలలోకములార శ్రావ్యంబు గాను
బెక్కు కీతులఁ బాడి వినువీధు లెల్ల
స్రుక్కక చరియించు శుకముఖ్యులార 14

సిగరముల్ పై కెత్తి ఛిన్నంబు గాఁగ
గగనంబుఁ బొడువం గఁ గలకొండలార
వాయువేగముతోడ వాయుమార్గం బ
మేయగతిం బోవుమేఘంబు లార 16

యెన్నం గ నెవ్వాని కీల నొక్కయాకు
సన్న మాతనలో విశాలప్రపంచ

మును బురంబులు గ్రామములు నిల్వఁజూపి
యనుపమసుఖ మిచ్చు నప్పూర్వు లార 18
యఱచేతిగుంటలో నాడక నిల్చు
ముఱిముఱి బొట్టు పెన్మున్నీరు గాఁగ
మురియుచు నిల్చు చాపురుగులకంటె
నరయఁ గా నతిసూక్ష్మ మహాజాతులార 20
మీర లెందున్నను మీరు పెద్దైన
మీ రణు వే వేగ మే పొగడుండ
యల మహాశక్తిని నలమహాబుద్ధి
నలసర్వరక్షకు నలసర్వ కర్త. 22
అందిం దనాక బ్రహ్మాండంబు సర్వ
మం దుండి పాడుఁడీ యహహా బ్రహ్మాండ
మెల్ల ఘోషింప బలే స్తవగీతి
నల్ల యీశ్వరు కర్మ లార మె ల్గెత్తి 24



కం॥ మునిజనపుంగవ సదమల
మనోంబుజవిలోలభృంగ మంగళదాయీ
ఘనభవదవప్రవర్షా
యనంతకళ్యాణ సచ్చిదానందమయా. 25
గద్య॥ ఇది శ్రీవాధూలసగోత్ర తాడూరిరామరాయ
భట్టాగ్రపుత్ర లక్ష్మీ నరసింహ రాయ
ప్రణీతంబైన జ్ఞానోదయమునందలి
భక్తి మార్గము.



శ్రీ

# జ్ఞానోదయము.

## వైరాగ్యమార్గము.

### ప్రథమాధ్యాయము.

### ఈషణమాయ.

## VANITY OF HUMAN CARES

*(Cowley.)*



కం॥ శ్రీకరణపటుకృపాబ్ధీ
లోకాధిష్ఠాన సర్వలోకాధ్యక్షా
లోకేశ శోకనాశన
లోకాత్మా పాపహార సులోచన దేవా. 1

తే-గీ॥ భూరి వాధూల గోత్రాబ్ధి వారిజాత
వైరి తాడూరి రామన పండితాగ్ర
సుతుఁడు లక్ష్మీ నృసింహుండు సూక్తు లెలమిఁ
జెప్పుచున్నాఁడు నరుల కై చిత్తశుద్ధి. 2

తే-గీ॥ నీవు దిగ విడ్చు నట్టియు నిన్నుఁ దాన
విడుచు నట్టియు సిరిఁ గూర్పఁ గడఁగ నేల ?

అన్న మర్త్యుఁడ పాఱిపో నున్న నీకు
భారము ను మోవ మదిలోనఁ గోర నేల? 3

తే.గీ॥ అన్న మంటిలోఁ గలయంగ నున్న నీకు
మేడలు ను మిద్దెలు ను గట్ట వేఁడ నేల
మొలక నాటి యుఁ గనఁ బోవు ఫలము మృత్యు
దేవి చల్లెడు విత్తన మీవ యగుట. 4

తే.గీ॥ అకట చంచలచిత్త యై నట్టి లక్ష్మిఁ
గాలు సేతులు త్రాటిచేఁ గట్టి పెట్టి
యనుభవించుచు భోగముల్ తనుజులకు ను
నిలుపుదువు సిరిఁ బో యిందు నేర్పు మీఱ. 5

ఆ.వె॥ ఐన మృత్యుదేవి నీ నేర్పు నవ్వుఁజు
మ్మొక్క కాప కాచి యుర్విఁ జచ్చు
మొలక శాశ్వతము గ నిలుచు మ్రాఁకున నంటు
గట్టు తోఁట వానిఁ గాంచి నగరె. 6

ఆ.వె॥ నేర్పరి ని బాదపరి నెఱిఁ బాటు పడు వాఁడ
నంచు మదిని సంతసించె దీవు
వెట్టి నరుఁడ నీవు వెల తొత్తు వ్రాలెను
బరుల కొఱక శ్రమము పడుదు సుమ్మి. 7

ఆ. వె॥ నీది కాని పనికి నాది నా దనుచుఁ బూ
సికొని తిరిగె దీవు సిగ్గు లేక
ఉత్తరమ్మునకు నురిత్తజిజ్ఞాసమ్ము
పడుట నీదు పని యె వెడఁగు నరుఁడ. 8

తే. గీ॥ వృద్ధులకు దేహ బుద్ధులు వృద్ధిలోన
వశము గా నని వారల బాలు రంద్రు
మూఢుఁ గాళ్లు మున ళ్లయ్యు మూఢు లగుచు
వారొడమె గోరఁ గనుటచే బాలు రౌర. 9

తే.గీ॥ చీమలు వసంతమున యంద శిశిరమునకు
వస్తుతతి మెల్పుతోఁ గూర్ప వచ్చుఁ గాక
పుట్టి నెలలోనఁ జచ్చెడు నట్టి మిడుత
లట్టి పాటు పడుట వ్యర్థ మగు న కాదె. 10

ఆ. వె॥ బ్రదికి నన్ని నాళ్లు పరికింప భోగంబు
లనుభవింపఁ గలుగ నగు న యేని
మన మదాంధకారమునఁ గన్ను బ్రమయుట
వసుధఁ గొంత సైఁప వచ్చి యుండు. 11

ఆ. వె॥ కాని మబ్బులోనఁ గడు బొబ్బ లిడుచు ను
మెఱయుచు ను జనించు మెఱుము వ్రాలెఁ
బుట్టి నెలఁగి యుంచు కట్టె యరిష్టంబు
గొట్టి పోవు భోగకోటి మనకు. 12

తే.గీ॥ ఓ యదృష్టమ దవ్వుల నున్నవారి
కెంత యు ను రమణీయ మై యొసఁగు దాన
దంబమును దాల్చి నట్టి పేదఱిమి నీదు
చె న్నకట యెండలో వానచినుకు చెన్ను. 13

తే.గీ॥ కన్ను దెఱచి నీపోనున్న కందువ గను
మన్న కడవ నీఁదఁగఁ బోకు మన్న కడలి
యీశ్వరుని కీవు నతి మింటి కెగుచు మన్న
పుడమి నడఁకున బ్రదుకం గఁ గడఁగు మన్న. 14





# వైరాగ్యమార్గము.

## ద్వితీయాధ్యాయము.

## పౌరుషదౌర్బల్యము.

## HUMAN FRAILTY

(*Cowper.*)



తే.గీ॥ అబలుఁడు ను జల చిత్తుండు నరయ నరుఁడుఁ
కష్టపడి మదిఁ గామించి కడఁగి నేఁడు
వ్యూహ మొక్కటి పన్ని యావ్యూహ మాతఁ
డలిగి విప్పెడు వాఁడు సు మ్మకట రేపు. 1

తే.గీ॥ అల యధర్మము చచ్చె నో యనఁగ నారి
లాఁగి యేత్తెఱ నతఁడు దలంప ధర్మ
మొక్కఁడు ను గాని నారి హరింప మోహ
మడఁగి ధర్మ మధర్మ మ కడఁ జెలంగు. 2

తే.గీ॥ వాని ఋజుమార్గమున కడ్డ పడఁగ శత్రు
షట్క మందున నొక్కఁడు సందుచూచు
చుండు నద్దాన ధర్మరతుం డ యయ్యు
భోగ వశుఁ డగు నిర్మల బుద్ధి పోయి. 3

తే.గీ॥ దీన నేర్పరి యగు వాని దైనహృదయ
మెల్ల నవగుణయుత మంచుఁ దెల్ల మయ్యె
జిహ్వతో వాఁడు కా దని చెప్పె నేని
యిది నిజం బంచు మదిఁ దాన యెఱుఁగుఁ జుమ్మి. 4

ఆ.వె॥ చిరశరీరయాత్ర చేయవలయువాఁడు
తనకు వచ్చు నిడుమ గనఁ గ లేని
వాఁడు దైవబలము వడయ నేరనివాఁడు
నరుఁడు తనబలమ్ము నమ్ము వమ్ము. 5

తే.గీ॥ దూరతీరమ్ముఁ జేరఁ గాఁ గోర వార్ధి
నోడ నడుపఁ గోలలు మాత్ర మోప లేవు
తాను బూరింప వలె జగత్ప్రాణుఁ డోడ
చాప యటు గాక మానిసి శ్రమము వృథయ. 6





# వై రా గ్య మా ర్గ ము.

## తృతీయాధ్యాయము.

## అక్షరమైత్రి.

## FRIENDSHIP IMMORTAL

(*Montgomery.*)

---

ఆ-వె॥ ఒకని వెనుక నొక్కఁ డుర్విలో హితు లెల్లఁ
బోవువారు హితుఁడు పోనివాఁడు
పుడమిలోనఁ గలఁడె వెడఁ బాయ కుండెడు
చెలిమి మదిని దలఁపఁ గల దె యెందు. 1

తే-గీ॥ అస్థిరం బైన యీలోక మకట యొక్క
టే దలంపఁ గ నాధారమేని మనకు
బ్రదికి యుండినఁ జచ్చినఁ బడయనేర
మే సుఖంబులు నెన్నఁడు నిది నిజంబు. 2

తే-గీ॥ మనకు గోచర మగు జీవమునకుఁ గాల
మునకు బాహిరము గ దివ్యఘనజగంబు
గలదు జీవంబు స్థిర మందుఁ గల్ల గాక
సఖ్య సంబంధములు ను శాశ్వతము లందు. 3

తే॥ అల జగంబు మీఁదఁ గల దందు నెడఁ బాపు
లెవ్వి యెఱుఁగ రా న వించు కైన
మేలికొఱక యైనమేలు వారే కాక
నిష్ఠులైనవార లెవరు లేరు. 4

తే॥ ఇందుఁ జచ్చువార లందుల కేగి యా
దివ్యలోకమందు భవ్యమైన
పదవి నొంది పెద్ద ముద మందు చొండొరు
లెసఁగువారు ప్రేమ యెసఁగ మెసఁగ. 5

తే॥ ఒకటివెనుక నొకటి యూహింప నవ్విధం
బున న చుక్క లెల్లఁ బోవు చుండు
నుదయరేఖ తోఁచు నది మొదల్ సూర్యుండు
పొడుపుఁ గొండ మీఁదఁ బొడుచుదాఁక. 6

తే॥ ఐనఁ జుక్క యొక్క టే నంధకారంబు
నందుఁ గ్రుంకఁ బోద యవి యు నెల్ల
దివ్యమైన యట్టి తేజంబు నందున
మఱుఁగు వడి కరమ్ము మెఱయు చుండు. 7

—•—



# వైరాగ్య మార్గము.

## చతుర్థాధ్యాయము.

### అక్షరము.

## IMMORTALITY

(*Montgomery.*)

---

తే-గీ॥ కలద యుపశాంతి యేడ్చువారలకు మఱియుఁ
గలదు విశ్రాంతి ఖిన్నపాంథులకు నిజము
పుడమి యడుగున వారలు పొందు మీఱ
నిలిచి నిద్రింత్రు నెమ్మది గలిగి మిగుల. 1

తే-గీ॥ ఈవు ద్రిమ్మరి వౌచు నిం పేదు దైన
మిక్కుటంపు గాలివాన నీయెక్కి నట్టి
యోడ ముంపంగ నగు నేని యోడ పగిలి
యఖిల కష్టంబులకు గుఱి యైతి వైన. 2

తే-గీ॥ ఎట్టి దురవస్థలో నున్న నెందు నున్నఁ
దప్పనీ దని దైవకృతజ్ఞుఁడ వగు
మయ్యొ నిను దిద్దు దుఃఖంబు లనుభవించు
తఱిని దేవుని చల్ల చే దమ్మి గనుము. 3

తే-గీ॥ వినుము నలిగిన నాళంబు విఱువఁ డాతఁ
డతని బిడ్డ లెల్లను దుఃఖ మనుభవింత్రు
వారి దయఁ జూడఁగాఁ గనే వాఁడుగొట్టు
వ్రణము మాన్ప నె కొట్టుఁ జూ వాఁడు వారి. 4

తే-గీ॥ కల ద యుపశాంతి యేడ్చువారలకు మఱియుఁ
గలదు విశ్రాంతి ఖిన్నపాంథులకు నిజము
పెద్దనిద్దుర ఫ్రాయెను పృథ్వి లోనఁ
దలఁపఁ గా బూది మాత్ర మ నిలుచుఁ గాక. 5

తే-గీ॥ దేవునికిఁ బ్రతిబింబ మౌదివ్య మైన
యాత్మ మంటిచేత విముక్త మగుచు మహిమ
నిత్యవైకుంఠ పురములో సత్య మైన
దినమణి యనం గ నొప్పుచుఁ దేజరిల దె. 6

తే-గీ॥ సూర్యుఁ డొకమిడుఁగుఱుఁ బుర్వు సోయగమునఁ
జూడఁ గాఁ జంచలపుఁ దోఁక చుక్క నువ్వో
యాత్మ యైనను దనతండ్రి యైన దేవు
రీతి నక్షర మై యొప్పు మృతి యు లేక. 7





# వైరాగ్యమార్గము.

## పంచమాధ్యాయము.

## పుష్పము.

## BLOSSOMS

(*Herrick.*)



ద్విపద॥ మా లతల్ ఫలదముల్ మహిలో న టంచు
జాల నాసలఁ గొల్పు చక్కని పువ్వు 1
లార కారణ మేమి యక్కట రాలి
యీరీతిఁ బోవం గ నింత వేగం బ? 2
నిన్న గాక య మొన్న నిక్కంబు మీరు
పన్ను గాఁ బుట్టిన వారలు గారె? 3
కొండొక కాలంబు కోర్కి దీరం గ
నుండం గఁ బోలు మీ కుర్విలోఁ గాదె? 4
కట కటా పూలార గడియ యో లేక
యిట నఱగడియ యో యింపులు గుల్కి? 5
పోవఁ గా మీరలు పుట్టి వారె?
దైవంబు మీపేర్మి తగ మాకుఁ జూపి 6

## జ్ఞానోదయము.

యీ విధంబున మిమ్ము నేము గోల్పోవఁ
దా విధియించె సంతస మేది మాకు? 7

ఐనఁ జక్కనిమిమ్ము నక్కటఁ జూడఁ
గాను మేదినిఁ దక్క గల వస్తువులను 8

మీ యీడు రా కున్న మేల్ వ్రాయి వేగ
మే యంత మొందు నం చెఱుఁగఁ గల్గితిమి 9

తమ చక్కఁదన మెల్లఁ దగఁ జూపి యకట
మిముఁ బోలె నవి యు నిమేషంబు లోనఁ 10

గాటి కేగెడుఁ జుమ్మి కావున నరుల
కేటికి గర్వించి యిల విఱ్ఱవీఁగ? 11

---



వై రా గ్య కాం డ ము.

షష్ఠాధ్యాయము.

ఋ ణా లం కా ర ము.

## THE LENT JEWELS

(*Anonymous.*)

---

ద్విపద॥ అవనిలోఁ దొల్లి శేషాచార్యుఁ డనెడు
ప్రవిమల బుద్ధి యుపాధ్యాయుఁ డొకఁడు 1
పాఠశాలకుఁ బోయి పవ లెల్ల శ్రద్ధఁ
బాఠముల్ శిష్యులఁ బఠియింపఁ జేసి 2
తనకూర్మి యిల్లాలిఁ దనయిద్ద ఱైన
యనుఁగు బిడ్డలఁ జూడ నాసలు మదిని 3
దద్ద యుఁ బుట్ట సంతస మొసఁ గం గఁ
బ్రొద్దు గ్రుంకెడు వేళఁ బోయె నింటికిని. 4
అంత ద్వారమునొద్ద కాతని భార్య
యెంత యు భక్తితో నెదురు గా వచ్చి 5
వడిఁ గొనిపోయి చావటి లోన నిలిపి
కడుఁ బొందు గా ముందు గాఁ బల్కె నిట్లు. 6
ఎలమి నీరాకకు నెప్పుడు వేడ్క
గలనాకు నిప్పుడు కడుఁ బ్రియ మయ్యె. 7

అది యెట్టు లంటేని యక్కట సూర్యుఁ
డుదయించినది మొదలూఱట లేక 8

యుమ్మలించెడు డెంద మొకవిషయమున
నెమ్మది నద్దాని నీవు తీర్పఁగదె. 9

దయ తోడఁగొన్ని వత్సరములక్రిందఁ
బ్రియ భూషణంబులు ప్రియ బంధుఁ డొకఁడు 10

నాకు దాఁపఁగ నిచ్చె నాథ యానగలు
లోకంబులోన విలువ లేని వగును. 11

ఐనఁ గొంపోవంగ నక్కట వానిఁ
దాను జట్టము రాఁడ తనకు మాఱుగను 12

నోరు నైనఁ బంపఁడహో పెద్దకాల
మరిగె నగల్ నావి యనికొంటిఁ జుమ్మి 13

ఇట్టుండ నాచుట్ట మేతెంచి నేఁడు
పట్టు పట్టెను నగల్ పరఁగ నిమ్మనుచు. 14

చిరకాల మేగుటఁ జేసి యప్పట్టు
కరము చూడఁగఁ దప్పుగాఁ దోఁచె నాకు. 15

ఏ మనెదవు నీవు నిమ్మందు వెక్కొ
నామది నఱ లేక నాసొమ్ము వ్రాలె 16

నింతకాలము ప్రియ మెసక మెసంగ
సంతసించిన యట్టి చక్కని నగలు. 17

జ్ఞానో:

అనవుడుఁ బ్రియురాలి
వనజాక్షి సందేహపడ
నున్నది కర్తవ్య మొక
గిన్న దాన వెద నిక్క
ఎరవు వస్తువు లెల్ల నిఁ
మరలఁ గైకొనఁ బోలు
మఱియు నిచ్చెడు వాఁ
యఱ లేక యీవలె న
పెక్కండ్లు చుట్టము స్రె
నిక్క మనుభవింప నేర్పస మాత్ర
వాని రొక్కము మఱి నాఁ డడుగంగ
నీ వని చెప్పుట యెంతటి మాట? 23
నావుడు మేల్మేలు నాథ నీమాట.
ఈవు చెప్పిన మాట యొప్పు ఁ దేగాక. 24
జగతిలో నిట మీఁద సర్వకాలంబు
నగుఁ గాక మనలకు నది మేలనంగ. 25
అని లేచి నిజభర్త నంత లోపలికిఁ
గొని పోయి భూశయ్యఁ గొనియున్న తనదు 26
బిడ్డ లిద్దఱుఁ జూపె విభుఁడు ను నేలఁ
బడ్డ బిడ్డలఁ జూచు భగవంతుఁ డిచ్చి 27
పుచ్చికొన్నట్టి యీ భూషణంబు లవి
యచ్చుగా వారని యకట యెఱింగి 28
తన గృహిణి విరక్తి తలపోసి మదిని
వనట లేకొప్పె దైవము సేత యనుచు. 29

